సంపుటము 1] మే 1915 [సంచిక 11

# బాలమిత్ర



## పిల్లికూన ఎవరికి కావలెను?

ప్రేమయ్య ఒకనాడు తన చెల్లెండ్రగు, దానమ్మయు, కమలమ్మయు ఆడుకొనుచుండగా వచ్చి, వారికొక చక్కని పిల్లికూనను చూపి "ఇది ఎవరికి కావలెను?" అని యడిగెను. ఇద్దరును, నాకు, నాకు అని అరచిరి. వెంటనే అతడు దానిని వెనుకబెట్టుకొని, "ఏ చెయ్యి కావలెనని" యడిగెను.

"ఎడమచెయ్యి" అని కమల చెప్పెను

"కుడిచెయ్యి" అని దానమ్మ యనెను

"పిల్లి ఎడమచెయ్యి చెప్పినవారిది" అని దానిని కమల కిచ్చెను.

"ఆహా! ఎంత చక్కనిది. అన్నా! ఎక్కడిదిది? నీ కెక్కడ దొరికినది?" అని కమల యడిగెను.

"ఒకడు నదిలో పారవేయబోవుచుండగా అడిగి తెచ్చితిని" అని అత డుత్తరమిచ్చెను.

కమల దానిని తీసికొనగానే దానమ్మ ముఖము మాడ్చుకొని, "ఎప్పుడు మంచివన్నీ కమలకే పోతవి. మంచివినాకు వచ్చినయెడల అవి నాకే కావలెనని కోరను" అని వెళ్లి పోయెను.

"నేను కోరినవన్ని నాకు దొరకకపోతే నేను కోప పడను. దానమ్మకుకూడా పిల్లికూనదొరికితే ఎంత బాగుండును. దానికి పిల్లులంటే మహాయిష్టము." అని కమల యనెను.

ప్రేమయ్య ఇదివిని మెల్లగా బయటికిపోయెను. కొంచెము సేపటికతడు తిరిగి వచ్చి, "పిల్లికూన దొరకనివారికి కిన్నెరపెట్టి తెచ్చినాను" అనెను. దానమ్మ ఒక్క గంతువేసి దాని తీసికొనెను.

"ఆహా! ఎంత బాగున్నది. నాకు బాగా వచ్చిన రాగములన్నియు దానిమీద వాయించవచ్చును" అని యనెను.

కిన్నెరకంటె నా పిల్లే బాగున్నది. ఇదే నా కిష్టము"ని కమల యనెను గాని ఆమె చెప్పినదంతయు నిజముగాదు.

"పిల్లికంటె నా కిన్నెరే బాగున్నది." అని దానమ్మ అనెను. గాని ఈమె మాటలు సగము మాత్రమే సత్యము.

ఆ ఉదయమంతయు ఆమె కిన్నెర వాయించెను. తరువాత తన చెల్లెలువంక చూచెను. కమల పిల్లితో ఆడుకొనుచున్నను దాని దృష్టి కిన్నెరమీదనే ఉండెను. ఇంతలో దానమ్మ కీ సంగతి జ్ఞాపకమువచ్చెను. "నాకు పిల్లి చాల ఇష్టము. కమలకు కిన్నెరమీద నిండా ప్రీతి. మేమిద్దర మెందుకు మార్చుకొనకూడదు?" అని యనుకొనెను. గనుక "కమలా, నీకిష్టమువచ్చినప్పుడెల్ల నా కిన్నెరమీద వాయించవచ్చును" అనెను. ఆ మాట వినగానే కమల సిగ్గుపడి "అక్కా నన్ను మన్నించుము. పిల్లితో నీవాడుకొనవచ్చునని ముందుగానే చెప్పకపోయినందుకు సిగ్గుపడుచున్నాను" అనెను. తరువాత వారిద్దరును వాటిని మార్చుకొని ఇష్టము వచ్చినంతవరకు ఆడుకొనిరి. అప్పుడు కమల "ఒకొక్కరికి ఒకొక్కటి ఉండుటకంటె, కలిసిఉండుకొనుట చాల మంచిదికదా" యనెను.

"ఇకమీదట మనము మన ఆట వస్తువులను కలిపి ఆడుందము పోట్లాడుకొనవద్దు"ని వారు నిశ్చయించుకొనిరి.

"మనవలెనే, ఇతరులను మనము ప్రేమింపవలెను."



# కుందేలు, తాఁబేలు

ఛాయ: జడ నీకు నెవ రల్లిరే?

కుందేలు కూర్మంబుతోడ - నొకనాఁడు
పందెంబు వేసె నెట్లనిన
తొందరగ బరుగెత్తఁదలఁచి - పాపము!
తొందరొందె బాలలారా.

2. ముందుగా కుందేలు లేచి - కూర్మ
ముతో ముచ్చటించెను - నెట్టు లనిన
"పందెంబు వేసికొని మనము - వేగమే
పరుగెత్తుదము ర"మ్మటనెను.



3. తాఁబేలు దాని నాలించి - శశ
ముతో తాను జెప్పె న దెట్టు లనిన
"సేబాసు! నీతోడ నేను - పరుగెత్త
శ్రేణిలో నెంతటి దాన?"

4. "వెఱవనేటికి?" లె"మ్మటంచు - కుందేలు
"పరుగెత్తగలవు ర"మ్మనఁగా

“సరి! యట్లె గాని”మ్మటంచు - తాఁబేలు
జరిగె ముందుకు నెమ్మదిగను.

5. చెవులపిల్లి వేగ లేచి - యప్పుడే
చెంగు చెంగున గంతు లిడుచు
రవంతసేపులోనె తా వెళ్లి - “తాఁబేల!
రా ర”మ్మటంచు వచియించి.

6. గంతు లిడుచుఁ బరుగు లెత్తి - కుందేలు
కడకు మిక్కిలి డస్సిపోయి
చెంత నున్న చెట్టుక్రింద - నిద్రించెఁ
గొంతసేపు జగంబు మఱచి.

7. ‘తాఁబేలు తా వచ్చువఱకు - నే గొంత
సేపు నిద్రించి లే’తునంచు
నేపు మీఱఁగ నిదురపోయె - కుందేల
దెంతమాత్రము మేలుకొనక.



8. ఇంతలో తాఁబేలు తాను - వైచిన
పంతపుంబందెంబునందు
గొంతయైనను విసుకు లేక - చేరెను
కోరినట్టుల హద్దు కడకు.

9. కనులార నిద్రించుచుండి-కుందేలు
కాకి యొక్కటి కావు మనఁగా

దిగ్గుమని త్రుళ్లిపడి లేచి - పరుగెత్తె
తీవ్రంబుగా హద్దు కడకు.

10. హద్దుకు కుందేలు వెళ్లి - చూచెను
హాయిగా కూర్మ మట నుంట
'నిద్రచే నోడితి' నంచు - చింతించె
నిజ గర్వపుం జెవులపిల్లి.

11. 'నాకంటె ఘను లెవ్వ రి?' రంచు - ధరణిలో
టీకు డంబము లొల్కుచుండు
దిక్కుమాలినవాని జన్మ - మీ రీతి
నిక్కంబుగా గాకపోదు.

12. పట్టిన పట్టు విడువక యె - యెవరైన
బాగుగా నేమైనఁ జేయు
దిట్టంబుగా దానిలోన - జయమును
తీఱ పొందక యేమొ పోరు.

## చంద్రుడు

చంద్రుడేల యని అందువా? అది ఆకాశమం దుంచబడిన దేవుని గడియారమై యున్నది. సూర్యునివలన రేయిం



బగళ్లును, వేసవి శీతావసంత ఋతురాలు కాలములును కలుగుచున్నవి గదా. అలాగే చంద్రునివల్ల వారములును, మాసములును కల్గుచున్నవి. భూమిపై నున్న మహాసముద్రములలోను, సరస్సులలోను చాల పనిని దేవుడు చంద్రున కప్పగించియున్నాడు. జలములలో కదలిక చంద్రునివలెనే పుట్టుచున్నవి. ఆటుపోటులు కల్గునది చంద్రుని ఆకర్షణవలననే. గాలియందలి మార్పులును వీనివలననే. మనకు దెలియనియు గ్రహించజాలని ఇంకెంతపని చంద్రునివలన కల్గుచున్నదో మనమూహింపజాలము. ఇవి యావత్తును దయగల మన పరలోకపు తండ్రివలననే జరుగుచున్నవి.

# చెఱకుగడలు, మైనపువత్తి

అనేక శతాబ్దముల క్రిందట, మథురాపురములో నొక రాజుండెను. అతని రాజ్యమునందు మిగుల తెలివిగల వర్తకుడు నివసించెను. అతడు చాల న్యాయస్థుడైనందున బహు కీర్తియు, కీర్తితో పాటు ధనమును ఆర్జించెను. రాజుగారి కేదైన కావలసినయెడల అప్పిచ్చుచుండువాడు. ఈలాగున మిక్కిలి ధనవంతుడయి, మంచి చక్కనిమేడ కట్టించుకొని కావలసిన సామగ్రి కొని సుఖముగా జీవించుచుండెను.



అతని కిద్దరు కుమార్లు. వీరిద్దరిని చాల ప్రేమించి వారికి చదువుల చెప్పించెను. తన తరువాత, రాజుగారి పనులను నెరవేర్చుటకొకని నియమించుకొనుటకై నిశ్చయించి ఒక నాడు తన స్నేహితులను, బంధువులను రప్పించి వారికి విందు జేసెను. విందయినపిమ్మట, తన కుమారులను బిలిచి, వారికి చెరి

అయిదు రూపాయలనిచ్చి, మీరువెళ్లి, ఈ సొమ్ము ఖర్చుపెట్టి, మన యింటిలోని మధ్యగదిని మీరు కొన్నదానితో నింపుడనెను.

పెద్దకుమారుడు వెళ్లి ఊరంతా తిరిగి ఏమియు కనుగొనలేక ఒక సందులో బడి వచ్చుచుండగా, చక్కెర గానుగ నాడించువా డొకడు కనుబడెను. వానియింటి ముందర గానుగాడించినపిదప తీసిన పిప్పి కుప్పలు కుప్పలుగా బడియుండెను. వాడు దానినికొనివెళ్లి నౌకర్లచే తెప్పించి, గదియందుంచెను. "నాయినా, నేను తెచ్చి గదిని నింపితినిగదా! ఇంకెందుకాలస్యము? నా పని యేల ఇయ్యకూడదు?" అని అడిగెను. గాని తక్కినవారు, వాని సహోదరుడు వచ్చుదనుక ఆపిరి.

రెండవవాడు, తన సొమ్ములోని కొన్నిపైసలతో, ఒక చిన్న మైనపువత్తిని కొనితెచ్చి, గదిని శుభ్రముచేయించి, దాని ముట్టించి మధ్యపెట్టెను. అది క్రమక్రమముగా మండి, గదియంతయు, వెలుగయ్యెను.

అప్పుడు తండ్రి. "వీడు ఈ ఇద్దరిలో తెలివిగలవాడు. పెద్దవాడు సొమ్మంతయు ఖర్చుపెట్టి, పనికిరానిది తెచ్చెను. గాని రెండవవాడు, కొద్ది డబ్బుతో మిగుల ఉపయోగకరమైన దాని తెచ్చె"నని వానిమెచ్చి, వానిని తనకు తరవాత వానిగా నియమించెను.

# ప్రకృతి పాఠములు

10-వ పాఠము

## విత్తనముల ప్రయాణము

గతమాసమునందు విత్తనములవలని లాభము లెవ్వియో, వానియందలి భాగము లెవ్వియో నేర్చుకొంటిమి. చాలమంది పిల్లలు తమ ఉపాధ్యాయుల నడిగి వాటినిగూర్చి ఇంకా నేర్చుకొనియుందురు. ఈ మాసములో విత్తనముల ప్రయాణమునుగూర్చి కొంత నేర్చుకొన ప్రయత్నింతము.

పైన చెప్పినమాట మీకు చాల వింతగా నుండవచ్చును గాని నిజమైన స్థితిని విచారించినయెడల విత్తనములు తాము పుట్టినచోటనే యుండక చెదరిపోవుచున్నవి. అలాగు పోవుటలో అనేకవిధములుగా పోవుచున్నవి.

అలాగు చెదరిపోవునట్లు చేయుటకు కాపువాడు సహాయము చేయుచున్నాడు. తనకు కావలసిన పంటలకై విత్తనములను పొలములో చల్లుచున్నాడు, కొన్నివిత్తనములు నీటి ప్రవాహములచేత చాల దూరమువరకు తీసికొని పోబడుచున్నవి. అవెక్కడనో ఒకచోట గట్టెక్కి అక్కడపడి మొలకెత్తుచున్నవి. మరికొన్నివిత్తనములు, జంతువుల బొచ్చునందు చిక్కుకొని, ఇక్కడక్కడపడి మొలచుచున్నవి. గొఱ్ఱెలు

పండుకొనునప్పుడు దట్టముగానున్న దానిబొచ్చులో చిక్కు పడి, అగిలేచి విదలించుకొనునప్పుడుగాని చెట్లకైనను గోడల కైనను వీపు రుద్దుకొనునప్పుడు రాలిపోవును. వీటన్నిటికంటె గాలి విశేషముగా విత్తనములను చెదరగొట్టును. గాలి కివి విశేషదూరము పోవును. జిల్లేడు విత్తనములను గుర్తించుడు.




గాలి వాటిని చాల దూరమువరకు తీసికొని వెళ్లునట్లు విత్తనము చుట్టును సన్నని పోగులవలెనుండు కాడలున్నవి. ఇవి గాలి కల్లలాడుచు విత్తనమును చాలదూరము తీసికొని పోయి వదలును. కొన్ని విత్తనములకు ఈకెలవంటివి ఉండును. వీటి సహాయమున విత్తనము గుండ్రముగా తిరుగుచు పోవును.

అన్ని విత్తనములకంటెను, ఫర్న్సు, మాస్ అను మొక్కల విత్తనములు బహు చిన్నవియు, దుమ్మువలె నుండునుగాన గాలికి చాలదూరము కొట్టుకొని పోవును.

ఈ విధముగా మనము ఆయా చెట్ల విత్తనములను పరిశీలించినయెడల అవి కొద్దిగాను గొప్పగాను ప్రయాణము చేయును, "ఫలించి, అభివృద్ధిపొంది భూమిని నిండించుడ"ని దేవుని యాశీర్వాదప్రకారము వృద్ధినొందుచున్నటుల కనుగొనగలము.

---

# బైబిలు పిల్లలు

## అబ్రహాము

లోకములో అన్నిటికంటే "ప్రేమ" గొప్పది. ప్రేమగదా అనేక స్నేహితులను సంపాదించునది! అబ్రాహామునకున్న ఈ గొప్ప గుణమువలననే అనేకులప్రేమను, అన్నిటికన్న ముఖ్యమైనదియు, అవసరమైనదియు అయిన దేవుని ప్రేమను సంపాదించెను. వేదగ్రంథమున అబ్రాహామునకు "దేవుని స్నేహితుడు" అని పేరు ఇయ్యబడి యున్నది. గత మాసమున అబ్రాహాము బాల్యచరిత్రనుగురించి విచారించి యున్నాము. ఇప్పుడు ఆయనయొక్క మిగతకాలపు చరిత్రను నేర్చుకొందము.

అబ్రాహాము దేవుడు సెలవిచ్చిన దేశమునకు సాగిపోవుచుండెను. ఆతనివెంట ఒంటెలపై కూర్చుండి ఆతని భార్యయు



ఆమె దాసీలును వచ్చుచుండిరి. అబ్రాహాము మిగుల దయ
గలవాడైనందున అతడు అతని యొక్క వృద్ధదాసులను కంచర
గాడిదెలపై నెక్కించి వెంటదీసుకొని వెళ్లుచుండెను. మరియు
అతని తండ్రియు, అన్నకుమారుడగు లోతును అతని వెంబ
డించిరి. మార్గమధ్యమున అబ్రాహాము తండ్రి చనిపోయెను.
అబ్రాహామునకు పాపము! చాలా దుఃఖమున్నను ప్రభువు
నందు భక్తి విశ్వాసము గలవాడగుటచే తన ప్రయాణము
మాని వెనుకకు మళ్లి బంధువులకడ జేరక ప్రభువు చూపు దేశ

మునకు ప్రయాణమై పోవుచుండెను. అతడు తనవెంట వచ్చు చున్న లోతునకుకూడ తన ఆస్తిలో కొంత పంచి ఇచ్చెను. వారంతా ఒకచోట తమ గొఱ్ఱెలమందలతో గూడా ఆగిరి. అప్పుడు అబ్రాహాము గొఱ్ఱెకాపరులు లోతు గొఱ్ఱెలకాపరు లకు కలహము రాగా అబ్రాహాము లోతు కోరుకొనిన స్థలము వాని గొఱ్ఱెల మేతకిచ్చి, వచ్చిక బాగుగా లేని స్థలమున తాను తీసుకొనెను. చూచితిరా! అబ్రాహాము దొడ్డ బుద్ధి! తనయొక్క లాభము చూచుకొనక ఇతరుల ఇష్టమును నెరవేర్చునట్టి మంచి గుణశాలి. అతడు లోతునకు అనేక విధములుగా సహాయము చేసెను. లోతును చెరకు పట్టుకొని పోయినపుడు శత్రువులతో యుద్ధముచేసి గెలిచి వాని విడిపించెను. సొదొమగొమొర్రాలు అగ్ని గంధక ములచే కాల్చబడక ముందు అతని కుటుంబ సహితముగా వాని సంరక్షించెను. ఇట్లు మీరును ఇతరులకు సహాయము చేయ నేర్చుకొనుచున్నారా?

దేవుడు అబ్రాహామునకు ముసలికాలమున ఈసాకను ఒక పుత్రుని ఇచ్చెను. దేవుడు అతని ఒక్కడే కుమారుడు అగు ఈసాకును తనకు బలిగా ఇమ్మని అడిగినప్పుడు సందే హించక ఆలాగు చేయ సమ్మతించెను. గాని, దేవుడు ఒక్కడే అయ్యున్న ఆ కుమారుని బలిచెల్లించ నియ్యలేదు. అబ్రా

హాము అన్నిటికంటే దేవునియందే ఎక్కువ అభిమానము గలవాడు. గనుకనే ప్రభువు చెప్పినదెల్ల, ఆయనను సంతోషపరచుటకు చేసెను. గనుక దేవుడు అతనిని మిగుల యాశీర్వదించి అతడు ఇతరులకు ఆశీర్వాదకరముగా నుండునట్లు చేసెను.

అబ్రాహాము యొక్క ముఖ్యమైన గుణము, "విశ్వాసము." గనుక చదువరులగు బాలమిత్రులారా! మీరు ప్రభువునందు దృఢ విశ్వాసముగలిగి ప్రభువు ఇచ్చు గొప్ప ఆశీర్వాదము పొందుడు.

---

## బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రను చదివెడి బాలికాబాలులారా!

నేనుకూడా ఆనందభరితురాలనై, నేను చదివినకథలలో ఒక చిన్నకథను చెప్పగోరుచున్నాను. ఒకసమయమున ఇద్దరుస్నేహితులొకదారి నేగుచుండగా వారిలో వారికి వాక్యమను విత్తనమునుగూర్చి వాదముపడెను. అందుననొకడు దైవభక్తిగలవాడును సువార్తవిషయము పాటుపడినవాడును అయియుండెను. రెండవవాడు ముక్కోపియును తొందర మనస్సుగలవాడునై ఉండెను. కొంతసేపటికి ఆ ముక్కోపియగు మనుష్యుడు అతనిని జగడముచేసి నీవు నమ్మినదేవుడు నిన్ను యేలాగున పోషించునో నేను చూతునని చెప్పి వెళ్లిపోయెను. అటుపిమ్మట దైవజనుడు తనయింటికి వెళ్లి రహస్యముగా తాను

నమ్మిన దేవునికి పట్టుదలతో ప్రార్థన చేసెను. తన్ను నమ్మినబిడ్డలను అనాథులుగా విడువను మాట ప్రకారముగా అతడు ప్రార్థన చేయుచుండగా ఆ స్థలముదగ్గర ఒక శబ్దము కలిగెను. అంతట దైవజనుడు ప్రార్థన చాలించిచూడగా అప్పుడు తయారు చేయబడిన రొట్టెయొకటి పడియుండెను. అంతట ఆ దైవజనుడు దానిని దాచిపెట్టుచుండగా, ఆ నిమిషములోనే జగడమాడినవాడు వచ్చెను. వానిచేతిలో కొన్ని రూపాయలుండెను. అప్పుడతడు నీ దేవుడు నీకు ఏమిఇచ్చెను అని ఎగతాళిచేయు నారంభించెను. అందునకా దైవజనుడు కోపపడక శాంతముగా నాదేవుడు ఇచ్చినాడో లేదో చూడుము అని ఆ రొట్టె తెచ్చిచూపించెను. అటుపిమ్మట కొన్ని దివ్యమైన సంగతులను తెలియపరిచెను. అప్పుడు ఆ మనుష్యుని మనస్సు కరిగి అప్పటినుంచి తృణీకరించినది తలకు మూలరాయి. అనిన లోకోక్తి ప్రకారముగా తృణీకరించిన ఆ దేవునిని నమ్మి సువార్త చెప్పుటకు ప్రయత్నపడెను. గనుక ప్రియబాలమిత్రులారా! ఇతరులను రక్షణకు త్రిప్పుటకుగాను దేవునిశక్తి కనపరచవలెనని కోరికయున్నయెడల మన పూర్ణహృదయముతో దేవుని ప్రార్థించవలెను. దేవునిమహిమ ప్రభువైన యేసుక్రీస్తుద్వారా కనపరచబడినరీతిగా బాలమిత్రములైన మనద్వారా యేసుక్రీస్తుయొక్క మహిమ కనపరచుదుము. అట్టివారు మనలో లేచునట్లు కోత యజమానుని వేడుకొందము.

ఇట్లు

మీ నూతన స్నేహితురాలు

డొక్కా సుజానమ్మ, బొబ్బిలి

విశాఖపట్టణం జిల్లా

C. L. S. PRESS, MADRAS—1915